శ్రీరామజయం.



శ్రీమాన్ ఆర్కాడు రామస్వామిదాసులు వారి శిష్యులైన

అమ్మవారుకుప్పం గ్రామంలో యుండే

మండలం ముత్తయ్యదాసుచే

రచియింపంబడి

తిరుపతి శ్రీ వెంకటేశ్వర నిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడెను.

1913.

ఓం.

అస్మద్గురుభ్యోన్నమః

శ్రీ సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్ర

పరబ్రహ్మణేనమః

ఇది,

# శ్రీ కేశవ నామస్తోత్ర పంచవింశతి.

శ్రీరామారఘునాయకా సీతాపతేహరిమాధవా।
నారాయణానను గావరా నామీమనసీకృపయుంచరా।
కోరాటమేలరబిడ్డపై భవికవకోటిదయాపరా।
అరావణాసురమర్దనా హరికేశవా హరికేశవా।

2 సుజనాళులెల్లనునీపద స్తుతిజేసిబొందిరిమోక్షముగ।
నిజమైనవేల్పుడవంచునీ నిఖిలాత్ములెల్లనెరుంగరే।
గజమాదిదేవుడవన్నిచో గడువేగగాచిన శ్రీధరా।
అజరుద్రతాపసవందితా హరికేశవా హరికేశవా॥

3 నీదాససంగముజేరినే నిజభక్తితోభజయించిమీ।
పాదారవిందముగాంచినా భవనాశ మొందుటకెన్నడో।
ఓదాసభూతదయానిధీ భుజగేంద్రశాయమహీపతే।
ఆధారమైననుగావవే హరికేశవా హరికేశవా॥

4 క్షీరాబ్దిలోశయనుండవై క్షితినుండుజీవాధారమై।
క్రూరాత్ములందునుమాడినిర్గ గొనియాడుభక్తులగాచితే।
నారీశిఖామణిలక్ష్మికే నాధుండవో పురుషోత్తమా।
ఆరాతినంగనజేసిన హరికేశవా హరికేశవా॥

5 ననుగన్నతల్లియుతండ్రియుఁ నాబంధువర్గసుహృజ్జనముఁ।
నినుగానుతించియొకప్పుడుఁ నిమిషంబునైననెఱుంగనుఁ।
వనితాదిభోగములందునే వాత్సల్యముంచినమూఢునిఁ।
అనుకంపముంచిఖేలరా హరి కేశవా హరి కేశవా।

6 జగములతవిష్ణుమయంబునై సర్వంబునందునుపూర్ణమై।
యుగమాదికర్తయునీవనై యోగీశ్వరానుభవుండవా।
ఖగవాహనానినుగాపరా శమనాకరాదిపుష్కరా।
అగజాతనాయకప్రార్థరా హరి కేశవా హరి కేశవా।

7 దానాదిధర్మములనన్నియుఁ దగుతీర్థయాత్రలు జేసియుఁ।
గానంబులో మిముఁబాడియుఁ కైవల్యమున్నిరంతరఁ।
ధ్యానించుటయునెఱుంగనీ దారిద్రునింగరుణించవే।
ఆనందసాగరశ్రీధరా హరి కేశవా హరి కేశవా।

8 రాఘవరఘుమణినాయకా రాజాధిరాజమహాప్రభో।
కామాతురుండనిరోసిక కడద్రోయమీకదిధర్మమా।
నామీఁదనీదయకొంచమై ననుగూర్చిపాలనసేయరా।
అమ్మాయపూతనమర్ధనా హరికేశవా హరికేశవా।

9 ధరయంమునీపదపద్మముగా ధ్యానంబొనర్చెడివారికి।
పరమసుఖంబులనిచ్చుశ్రీ పరమాత్మవినుబలిమాలునా।
శిరమీమునీపదముంచిను స్థిరమైనబుద్ధినొసంగవే।
అరవిందనేత్రజనార్ధనా హరికేశవా హరికేశవా।

10 ఎన్నెన్నివిఘ్నములనిట్టుకే నేనెంచిప్రార్థనచేసియున్।
కన్నెత్తిచూడకనుండుటల్ కనుగొంకరుండను పేమునీ।
తన్నంపుకేమినిదర్శనం బూహించిబ్రోవుము వేగమే।
అన్నింటనుంబరిపూర్ణుడా హరికేశవా హరికేశవా।

11 కోపాదిగుణము లెల్లయుఁ గొనియుండుమానుషుఁడైన నే
పాపాదికృత్యము చేయుచుఁ బహుకష్టముప్పడుచుండునా।
తాపాదులఁ దొలఁగించినీ దాసానుదాసుగఁ జేయవే।
అఫాలలోచనవందితా హరికేశవా హరికేశవా।

12 జలజాసనాదిజగదీశ్వరా సర్వాత్ముఁడా పరమేశ్వరా।
ఇలమీఁద నీబహుమేదయు వెవ్వారితో వినవింతురా।
చల్లమేల రాదయచూడరా శరణాగతుఁడ నన్నేలరా।
అలవింతిలక్ష్మిమనోహరా హరికేశవా హరికేశవా।

13 అతిప్రీతియున్నిజభక్తియు న్నాచార్యబోధయు లేనిసఁ।
ఖ్యతిహీనుఁడఁ నతిక్రూరుఁడఁ మమలాదిమగ్నుఁడైన నే।
గతికోరినీచరణంబులఁ గపటంబుగా నుతియించెదఁ।
అతిశాంతమూర్తి నన్నేలవే హరికేశవా హరికేశవా।

14 వేమారు నీ చరితంబున౯ వినఁగోరి నే మతి నెంచగా।
కామాదిదుర్విషయంబున౯ కనకంబున౯ మనసున్న చే।
ఏమార్గముఁ గని కాలునిన్ యేమార్చి నీ పదమొందుదు౯।
ఆమార్గముం గనుపింపుమా హరికేశవా హరికేశవా।

15 కమలోద్భవుండగు బ్రహ్మయు౯ గజచర్మధారి శివుండును౯।
సుమహామునీంద్రులు యోగులు౯ సుజనాత్ములెల్లరు నీ పదా।
కమలాంఘ్రి నే నుతియింపఁగా కఠినాత్ము నే ననశక్యమా।
అమరేంద్రవందిత రాఘవా హరికేశవా హరికేశవా।

16 భువనాదికేవచరాచరం బులఁ బుట్టియుఁ దనజెందినై।
అవి యెల్లఁ గను కోయుచు౯ హరినై హరించను రుద్రుఁడై।
ఇవి మూఁడు మూర్తులు నీ కనై మున్నేయేయిటు గానికై।
అవికారనై వెలసిల్లు శ్రీ హరికేశవా హరికేశవా।

17 జనకాదులుఁ శుకశౌనకుల్ జపియించగా నరుడా పదం।
బును వేదములుఁ గొనియాడచుఁ బూజింపవచ్చునే గాని యీ।
మనశుద్ధియెంతయు లేనినే మతినెన్న సాధ్యముగాదరా।
ననుజీవిగాఁ గొనియేలరా హరికేశవా హరికేశవా।

18 ఏలాటి సుప్రియుచేతనా కీజన్మమిచ్చి ధరిత్రిలో।
బాలించశక్యముగాని సంసారాబ్ధిలో బడద్రోసినా।
పాలించకుండె దేవచ్యుతా బాలుండనా కభయంబురా।
ఆలస్యముంచక బ్రోవరా హరికేశవా హరికేశవా।

19 ఒకవేళనుండు విధంబువే రొకవేళ లేదీ గాత్రము।
ఇకనెప్పుడో యేవేళనో యీదేహముండు నజీవుడు।
పెకలించిపొయ్యెడు వేళనిఁ బిలువంగనియ్యకు వంకనై।
అకలంకనిప్పుడె బిల్చెదఁ హరికేశవా హరికేశవా।

